

# నా జీవితం నాది కాదు

సృష్టికర్తని సృష్టికి అందించే ప్రయత్నం చేస్తున్న ఆన్ లైన్ మాస పత్రిక

# My Life IS Not Mine

## మెహెరా మెహెర్

## స్కూల్ అఫ్ అవేకెనింగ్

బ్రతకడం జంతుత్వం -వ్యర్ధం
బ్రతికించడం మానవత్వం -అర్ధం
బ్రతుకునే ఇవ్వడం దైవత్వం -పరమార్ధం

సంచిక: 1
జూన్ 2015

మూలం: అమూలం
పత్రం: అపత్రం

## మిమ్మల్ని మీలోపలి తీసుకెళ్ళే ఈలోపల ఉండే విష-రహిత విషయాల సూచిక:



ప్రేమిస్తే ప్రేమే ఉంటుంది; భయానికి చోటు ఉండదు.
భయపడితే భయమే ఉంటుంది; ప్రేమకి చోటు ఉండదు.
-అవతార్ మెహెర్ బాబా



# {I}. అవతారుడి బాటలో హృదయపు ఆటతో కూడిన హాఫీజ్ మాట/పాట

హాఫీజ్ అందమైన కవిత్వంతో విశ్వ సౌందర్యాన్ని, ఆధ్యాత్మిక భూమికలు, మార్గాన్ని వర్ణిస్తూ విశ్వ రహస్యాలను బయల్పరిచే వాడు.

-అవతార్ మెహెర్ బాబా

(మెహెర్ ప్రభు 3-1087)



పర్షియన్:

దానంద్ ఆశికాన్ జెహ్ నియాద్ బా హీచ్
కార్ ఉమ్రే కే బే తో మీగు జారాద్ దర్ షుమార్ ఎ ఉమ్రే

ఇంగ్లీష్:

**Without You, Living is not Worthwhile and being this Lonely is not My Style.**

తెలుగు:

నువ్వు లేకుండా నేను బ్రతికే ఈ బ్రతుకు
ఎంత మాత్రము విలువైనది కాదు;
ఇలా ఒంటరిగా ఉండడం అనేది నా పద్ధతి కాదు.

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {2}. మెహెర్ ప్రభులోని ఆణిముత్యాలు
## {ఆనందం తప్ప మరేమీ లేదు}



లాహోర్ నుండి అమృత్ సర్ కి రైలు లో ప్రయాణిస్తున్నప్పుడు, ఆ రైలు కంపార్ట్ మెంటులో ఉండే ఓ 53 సంవత్సరాల ముసల్మాను బాబా చేత ఆకర్షింపబడినాడు.

ఆ వ్యక్తి బాబానే తదేకంగా చూస్తూ ఉన్నాడు. కాస్త సమయం తరువాత బాబా ఆ వ్యక్తి వైపు నేరుగా చూస్తూ తన మండలి ద్వారా ఈ విధంగా తెలిపారు:

"ఓ స్నేహితుడా! అక్కడ ప్రతీ చోట ఆనందం తప్ప మరేదీ లేదు."

బహుశా మీలాంటి వాళ్లకు అలా అనిపిస్తుందేమో కాని మాలాంటి వాళ్లకు కాదు సార్, అని ఆ వ్యక్తి బదులిచ్చాడు.

బాబా సమాధానమిస్తూ... నువ్వు వాటిని దర్శించలేదు కాబట్టి ఫిర్యాదు చేస్తున్నావు. కాని నేను చెబుతున్నాను అక్కడ చుట్టూ పక్కల ఆనందం తప్ప మరేదీ లేదు.

వాటిని నేను చూస్తున్నాను. వాటిని ప్రతీ క్షణం అనుభవిస్తున్నాను.

ఆ వ్యక్తి మాట్లాడుతూ...నేను ఈ ప్రపంచంలో కష్టాలను, సంఘర్షణలను, బాధలను తప్ప మరేదీ అనుభవించడం లేదు. నేను ఎన్నడూ సంతోషం గురించి తెలుసుకోలేదు మరియు నేను నా బ్రతుకుతో విసిగిపోయాను.

ఇది అజ్ఞానం వలననే అని బాబా వివరిస్తూ.. నీకు వాస్తవమైన ఆనందం గురించి ఎటువంటి అనుభవం లేదు.

నీవు నీడ వెంట పరిగెడుతూ విషయాన్ని/పదార్ధాన్ని కోల్పోయావు.

నువ్వు తినడం, డబ్బును సంపాదించడం కోసం, సుఖాలలో మరియు భోగాలలో ఉండేవే సంతోషం అని పొరపాటు పడుతున్నావు.

అవన్నీ నశ్వరమైనవి, అబద్ధమైనవి మరియు తాత్కాలికమైనవి.

అది మాత్రమే కాదు అవి నిన్ను నిత్యమైన , వాస్తవ ఆనందం నుండి దూరంగా తీసుకొని పోతాయి.

ఆ వ్యక్తి బాబాని ఈ విధంగా ప్రశ్నించాడు: "ఆ ఆనందాన్ని నేను ఎక్కడ మరియు ఏ విధంగా కనుగొనగలను?‘‘

బాబా వివరిస్తూ...అదే ఖచ్చితమైన పాయింట్. ఇప్పుడు నువ్వు ఏదో వాస్తవమైన వాటి గురించి అడుగుతూ కోరుతున్నావు.

నీ యొక్క కోరిక కేవలం ఈ ఆనందాన్ని కనుగొనుటకు, సత్యాన్ని కనుగొనుటకు మరియు భగవంతుడిని కనుగొనుటకు మాత్రమే ఉండుగాక!

ఈ తపనని నిరంతరంగా కలిగి ఉండగలిగితే నీవు సాధించగలుగుతావు. సాధించడానికి మార్గమును మరియు ఎవరో ఒకరు వాటిని నీకు చూపగలరు.

మీరు దానిని నాకు చూపగలరా? నాకు సహాయం చేయగలరా? అని ఆ వ్యక్తి పట్టుబడ్డాడు.

వెంటనే బాబా ...తప్పనిసరిగా, అదీ గొప్ప సంతోషంతో.

అదే నేను చేయదలుచుకొన్నది. అదే నా పని. అది నా మిషన్.

ప్రతీ రోజు తెల్లవారు జామున వీటికి ఓ 5 నిమిషాలు మాత్రమే కేటాయించు.
దూరంగా, ఏకాంతంగా ఉండే ప్రదేశాన్ని వెతికి ఎంచుకో.

"భగవంతుడు ఒక్కడే. అతను ప్రతీచోట ఉన్నాడు
మరియు అతను తప్ప మరేదీ లేదు."

[God is One. He is everywhere and
there is nothing but HIM.]

అనే వాటిపై ధ్యానిస్తూ, ఆలోచించే ప్రయత్నం చెయ్యి.

ఇలా ప్రతీ రోజు ఓ 5 నిమిషాల పాటు చేస్తూ ఉండు.
నీకు ఏదో అనుభవం కలిగేలా నేను చూసుకొంటాను.

నువ్వు ఏదో ఒక ప్రకాశాన్ని చూడగలవు.

అప్పుడు నువ్వు తృప్తి పడి మార్గంలో ముందుకు వెళ్ళగలవు.

ఆ వ్యక్తి తన కష్టాల నుండి ఉపశమనం పొందిన వాడిలా కనబడినాడు.

గురువును కలవడం వలన సంతోషపడుతూ గురువు యొక్క సలహాను స్వీకరించాడు.

బాబా ఇచ్చిన ఈ సులభమైన వివరణ మూలంగా అతనికి జీవితం అనేది మళ్ళీ బహు విలువైనది అనే అనుభవం కలిగింది.

జీవితానికి సంబంధించిన పునరుద్ధింపబడే ఉత్సాహపూరిత అనుభూతులు మాటల ద్వారా తెలియచేయడం అనేది జరగని పని.

అవి అంతర్గతంగానే ప్రసాదించాలి,అందించాలి.

ఆ వ్యక్తి ఇంతకు ముందు అనేక రకరకాల ఆధ్యాత్మిక కాటిన్యాలను ప్రయత్నించి, గురువు కోసం వెతుకుతున్నాడు.

కాని అనేక సంవత్సరాల తర్వాత బాధలు పెరిగి నిరుత్సాహపడి పోయాడు. అని మండలి వారు కనుగొన్నారు.

ఎప్పుడైతే ఆ వ్యక్తి బాబాని రైలులో కలిశాడో ఆ క్షణం వరకు ఆత్మహత్య చేసుకోవాలనే ఉన్నాడు.

బాబా అతనిని కాపాడడమే కాకుండా అతన అన్వేషణని కొనసాగించడానికి స్ఫూర్తిని అందించారు.

ఆ వ్యక్తి ఎవరో కాదు ...
భారతదేశంలో అత్యుత్తమ కవిగా ఎదిగిన మొహమ్మద్ ఇక్బాల్.

[లార్డ్ మెహెర్ పేజి.1187/8 (ఆన్ లైన్ ఎడిషన్)]



ఈ శరీరాన్ని విడిచిపెట్టి జీవుడు బయటకు వెళ్ళే సమయంలో మన
హృదయంలో ఉన్న శాంతి, ఆనందం 100 శాతం మనం
అనుభవించగలిగితే అదే చివరి జన్మ.
ఇక శవాలను మోయించు కోవలసిన అవసరం లేదు/రాదు/ఉండదు.
-కబీర్

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {3}. సత్పురుషుల జీవితంలోని సంగతులు (రమణ మహర్షి -పుట్టిన దినం)

"రమణ మహర్షి 6వ భూమికలో ఉండే అచ్ఛమైన/శుద్ధమైన/స్వచ్ఛమైన సత్పురుషుడు."
-అవతార్ మెహెర్ బాబా



నేను విరూపాక్ష గుహలో ఉండగా నా జన్మదినం(30/12/1912) వచ్చింది. దగ్గరున్న వారందరూ భగవాన్ జయంతి కదా! ఇక్కడే వండి భోజనం చేస్తామని పట్టుబడ్డారు. భోజనాలు అయినవి.

అప్పుడు నాతో ఈశ్వర స్వామి ఉండేవారు. వారు నాతో "స్వామీ నేడు మీ పుట్టినదినం కదా! మీరు రెండు పద్యాలు రాస్తే నేనూ రెండు రాస్తాను." అన్నారు.

అప్పుడే ఈ రెండింటిని రాసాను:

1. పుట్టినదినం అని పండుగ చేయుటకు సంకల్పించు
మీరు మీ పుట్టుకకి స్థానమేది? అని చూడండి.

జనన మరణములకు అతీతమైన ఆ నిత్య జీవనమందు
స్థానాన్ని పొందడమే సత్యమైన మన జన్మదినం.

2. ఏడాదికి ఒకసారి వచ్చే జన్మదిన రోజైన ఈ శరీరం వచ్చిందే, ఈ
సంసారంలో పడితిమే అని తపించాలి కాని ఉత్సాహంగా పండగ చేసి
సంతోషించడం శవమునకు అలకరించినట్లు ఉంటుంది.

ఆత్మనెరిగి అందులో లీనమగుటే వివేకము.

ఆ పాటల యొక్క భావం ఇదే.

-రమణ మహర్షి
(శ్రీ రమణాశ్రమ లేఖలు పేజి.219)

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం



## {4}. మనకు తెలియని అవతారుడు (మూడు విషయాలు)

నాకు ఈ మూడు విషయాలు తెలుసు:

1. ప్రతీ పదం యొక్క భావంలోనూ నేను అవతారుడిని.

2. నేను ఏమి చేసినా అది అవధులు లేని
నా ప్రేమ నుండే వ్యక్తమౌతుంది.

3. మీ అజ్ఞానం ద్వారా నేను అనంతమైన
వేదనను శాశ్వతంగా అనుభవిస్తున్నాను.

-అవతార్ మెహెర్ బాబా
[లార్డ్ మెహెర్ పేజి.4441 (ఆన్ లైన్ ఎడిషన్)]

ఈ విష-రహిత విషయాలు అవతారుడికి తెలియదని ఇంతవరకు పొరపాటు పడుతున్నాము.
ఇక మీదట ఆ పొరపాటు అలవాటు కాకుండా మన గ్రహపాటును కాస్త సరి దిద్దుకొందాం.

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {5}. జ్ఞానేశ్వర్ అందించిన జ్ఞానేశ్వరి {భ్రాంతి}

నేను జ్ఞానేశ్వర్ తో చాలా దగ్గర సంబంధం కలిగి ఉన్నాను.
-అవతార్ మెహెర్ బాబా



అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞా వాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతా సూంశ్చ నాను శోచంతి పండితాః ॥
(2వ అధ్యాయం(సాంఖ్య యోగము) 11వ శ్లోకము)

శ్రీకృష్ణుడు అర్జునుడితో ఈ విధంగా పలికెను:

నేడు నీవు మధ్యస్థముగా తెచ్చిపెట్టిన ఈ తగవు నాకు ఆశ్చర్యమును కలిగించుచున్నది. నీవు "నన్ను నేను ఎరుగుదును" అని చెప్పుతున్నావు.

కాని నీవు అజ్ఞానాన్ని వీడకుండా ఉన్నావు.

నేను ఏదైనా చెప్పడం ప్రారంభించినప్పుడు నీతి శాస్త్రమునకు సంబంధించిన పెద్ద పెద్ద మాటలను చెప్పడం ప్రారంభిస్తున్నావు.

పుట్టుకతో గుడ్డివాడై ఉన్నవానికి ఉన్మాదము కలుగుటచే అటు ఇటు అతడు ఏ విధంగా వెర్రిగా తిరుగుతాడో అదే విధంగా నీ బుద్ధి కూడా భ్రమనొంది వెర్రిగా అటు ఇటు తిరుగుతున్నట్లు కనిపిస్తున్నది.

నీ గురించి నీకే తెలియనప్పుడు కౌరవులను గురించి నీవు శోకించడం చూస్తే ఆశ్చర్యం కలుగుతున్నది.

అర్జునా! ఈ ముల్లోకములు నీలానే స్థిరత్వం, స్థావరత్వము గలవైనచో లోకులు ఈ జగత్తు అనాది నుంచి గలదని చెప్పుకొనుట అసత్యమని నీవు అంగీకరిస్తావా?

సర్వసమర్ధుడు అయినవాడు ఒకడు ఉన్నాడని, అతని వలననే ఈ సమస్త భూత సృష్టి జరుగుతున్నది అని పలికే లోకులు చెప్పుకోనేదంతా అబద్ధమేనా?

ఈ జగత్తు అంతా నీవలనే సృష్టించబడి, నీ వలననే నాశమొందునట్టి స్థితికి వచ్చినదా?

సోదరా! నీవు ఈ విషయములను గురించి కొద్దిగా ఆలోచించు. నీవు భ్రమ వలన అహంకారం గలవాడు అయినావు. అందువలననే వీరిని వధించుట నీకు నచ్చలేదు.

నీవు నాకు ఒక విషయమునకు సమాధానం చెప్పు.

నీవు వీరిని చంపనంత మాత్రాన వీరు చిరంజీవులుగా ఉంటారా?
నీవు ఒక్కడివే వీరందరినీ సంహరిస్తున్నావని, అందువలననే వీరందరూ
మరణిస్తున్నారనే భ్రమతో కూడిన ఊహను చేసుకొనలేదా?

ఈ జగత్తు అనాది సిద్ధము. ఇది సృష్టి నియమమును అనుసరించి లయమౌతుంది. ఇటువంటి స్థితిలో నీవు దేనికోసం విలపిస్తున్నావో చెప్పుము. నీవు మూర్ఖత్వం వలన యుక్తాయుక్తములను ఆలోచించకుండా వ్యర్థమైన విచారమును పొందినవాడై, నాకే భోదించడం మొదలుపెట్టావు.

ఓ అర్జునా!

నిజమైన వివేకవంతులు పుట్టుట,
చచ్చుటలను కేవలం భ్రాంతిగా భావిస్తారు.
అందుచే వారు వీనిలో ఏ ఒక్క దానికి కూడా శోకించరు.

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {6}. మానవత్వాన్ని ప్రేమించి అవతారుడి దరిజేరిన మనిషి (డా॥ ఆల్బర్ట్ స్విట్జర్ {14/1/1875 -4/9/1965})



నిస్వార్థ సేవ అనేది కనీసపు అహంకారపు చేరిక లేకుండా చేయవలసిన సేవ. స్వల్ప అహంకారపు ఆలోచన సర్వస్వాన్ని చెరిపేస్తుంది. చాలా మందిలో ఒకే ఒక్కడు మాత్రమే ఇటువంటి మానవత్వానికి సేవ చేయడంలో సఫలీకృతమౌతాడు. సత్పురుషులకు సహితం ఇటువంటి కార్యం అసాధ్యం.

పశ్చిమంలో కూడా ఇటువంటి సేవని ఒక వ్యక్తి నిర్వర్తిస్తున్నాడు. *** కుష్టురోగులకు ఆశ్రయం ఇస్తున్న అతను ఓ డాక్టర్. ఎల్లప్పుడూ ఆ డాక్టర్ ఆ కుష్టురోగులతోనే ఉంటూ తన గురించి తాను ఆలోచించుకొనే సమయం లేనంతగా తన పనిలో లీనమైపోయాడు .

ఆ డాక్టర్ కి మెహెర్ బాబా అంటే ఎవరో తెలియదు. అటువంటి వ్యక్తులు నిస్వార్థ సేవని నిర్వర్తించగలరు. కాని వాళ్ళు నా వద్దకి రాకుండా ఉంటారు. ఎందుకు?

అక్కడ మనస్సు ఉంటుంది కాబట్టి. అత్యంత సూక్ష్మ ఆలోచన బంధనాన్ని సృష్టిస్తుంది. కాబట్టి అది బాబాని తెలుసుకోకుండా నిరోధిస్తుంది.

ఇదంతా అయినప్పటికీ అటువంటి వ్యక్తులు తమ శరీరాలను విడిచిపెట్టగానే వాళ్ళు నా వద్దకే వస్తారు. ఎందుకంటే వాళ్ళ ఆలోచన వాళ్ళ గురించి కాక వాళ్ళు నిర్వర్తించే కార్యాన్ని ముందుకు తీసుకెళ్ళడంలో మరియు అభివృద్ధి చేయడంలోనే ఉంటారు.

కాబట్టి వాళ్ళు నా వద్దకే వస్తారు.

-అవతార్ మెహెర్ బాబా

[లార్డ్ మెహెర్ పేజి.3774 {ఆన్ లైన్ ఎడిషన్}]

***బాబా సూచించింది డా॥ ఆల్బర్ట్ స్విట్జర్ అనే జర్మన్ డాక్టర్, ఫిలాసఫర్.

# అది సరిపోదు

-డా॥ ఆల్బర్ట్ స్విట్జర్

కేవలం "ఉంటున్నాను" అనేది సరిపోదు.

నేను నా కుటుంబం కోసం తగినంత సంపాదిస్తున్నాను;
నేను నా పనిని చక్కగా చేసుకొంటున్నాను;
నేను ఓ మంచి తండ్రిని, నేను ఓ మంచి భర్తని, నేను ఓ మంచి తల్లిని,
నేను ఓ మంచి భర్తని, నేను చర్చికి క్రమం తప్పకుండా
వెళుతున్నవాడిని; అనే నీ మాట సరిపోదు.

అదంతా బాగానే ఉంది.
కాని నువ్వు ఇంకా ఏదో ఎక్కువగా ఖచ్చితంగా చేయాలి.

ఎక్కడో ఒక చోట, ఒక్కడో కాస్తంత మంచిని
చేయడానికి ఎల్లప్పుడూ అన్వేషిస్తూ ఉండు.

ప్రతీ వ్యక్తి తనకు తానుగా తన వాస్తవమైన విలువను
తెలుసుకోవడానికి తనదైన మార్గాలలో అన్వేషించాలి.

నీ తోటి మనుష్యులకు కాస్తంత సమయం ఇవ్వాలి.

నువ్వు నీ కోసమే బ్రతికేలా ఈ ప్రపంచంలో
బ్రతకకు అనేది గుర్తుంచుకో.

నీ తమ్ముళ్ళు మరియు చెల్లాయిళ్లు కూడా ఇక్కడ ఉన్నారు.

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {7}. అవతారుడి విశ్వ కార్యంలోని ఇద్దరు ప్రకాశవంతమైన ఆత్మలు (హజరత్ ఇనాయత్ ఖాస్ & స్వామి వివేకానంద



తూర్పుకు సంబంధించిన సర్వోత్కృష్టమైన మార్మికత్వాన్ని పశ్చిమ ప్రపంచానికి మొదటిగా పరిచయం చేయడంలో ఈ ఇద్దరు ప్రకాశవంతమైన ఆత్మలు భాద్యత వహించారు.

సద్గురువు రామకృష్ణ పరమహంస ముఖ్య శిష్యులలో ఒకరైన స్వామి వివేకానంద 1893 మరియు 1897 లో అమెరికా పర్యటించి అక్కడ వేదాంతం యొక్క మార్మికతను పరిచయం చేశారు.

1911లో పార్శీ సూఫీ యొక్క మార్మికతను ముర్షీద్ ఇనాయత్ ఖాస్ చేత అమెరికాకు పరిచయం చేయబడింది.

ఈ గొప్ప ఆత్మలు (స్వామి వివేకానంద & ఇనాయత్ ఖాస్) పశ్చిమ ప్రపంచంతో తూర్పుకు సంబంధించిన మార్మికతను మిశ్రమం చేయడంలో ముందుకు తీసుకెళ్ళారు/నడిపించారు.

**ఇది మెహెర్ బాబా తన అవతార అవతరణ సమయంలో నిర్వహించిన విశ్వాత్మక కార్యంలోని ఒక అంశం.**

కలకత్తాకు చెందిన సద్గురువు రామకృష్ణ పరమహంస(20/2/1836-16/8/1886) వంశ పరంపర నుండి వేదాంతపు మార్మికత పశ్చిమ ప్రపంచానికి వచ్చింది.

అజ్మీర్ కు చెందిన సద్గురువు మొయినుద్దీన్ చిష్టి (1141-1236) వంశ పరంపర నుండి పార్శీ సూఫీజపు మార్మికత వచ్చినది.

[లార్డ్ మెహెర్ 9-3066 {USA ఎడిషన్}]

చిన్న చిన్న మట్టి ముద్దలలో (శరీరాలు, బయట వస్తువులు) ఏమి సుఖము ఉన్నది?
ఘనీభవించిన, సారభూతమైన అనంత సుఖమే మనకు కావాలిసినది.
దానినే వెతకాలి.

అటువంటి అనంత సుఖము ఒక్క పరమాత్మయందే ఉన్నది.
కావున పరమాత్మను గూర్చియే మనం అన్వేషించాలి.
మన సమస్త ప్రయత్నములు,అన్వేషణలు ఆ పరమాత్మను గూర్చియే కొనసాగవలెను.

-స్వామి వివేకానంద

What enjoyments can there be in these little clods of Earth?
It is the crystalised essence of Infinite Enjoyment that we have to Seek and that is in God.
Let all our Passions and Emotions go up unto HIM.

-Swami Vivekanada

ఆత్మను జ్ఞానవంతం చేసే పదాలు ఆభరణాల కన్నా ఎంతో విలువైనవి.

-హజరత్ ఇనాయత్ ఖాన్

The Words that Enlighten the Soul are more precious than Jewels.

-Hazrat Inayat Khan

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

నీవు కోరికలకు అతీతంగా ఉండగలిగితే చావు పుట్టుకల వలయం నుండి సునాయాసంగా బయటపడవచ్చును.

-అవతార్ మెహెర్ బాబా

# {8}. సూఫీజమ్ గగనంలో విహరించే నేను!
(ఇది రూమి మాట సుమీ)



ఇరాన్ లో షామ్స్-ఎ-తబ్రీజ్, మౌలానా రూమి మరియు హాఫీజ్ అందరూ పరిపూర్ణులే.
-అవతార్ మెహెర్ బాబా

మౌలానా రూమి ఎంతో తెలివైన వాడు. రూమికి ఇప్పటి పండితుల అందరి మెదడుల కన్నా ఎన్నో మెదడులు ఉండేవి. రూమి విద్యార్థిగా ఉండే సమయంలో ఆధ్యాత్మిక పై ఎన్నో పుస్తకాలు రచించాడు.

ఒకనాడు షామ్స్-ఎ-తబ్రీజ్ సద్గురువు రూమి ముందుకు వచ్చి అతని పుస్తకాలన్నీ దగ్గరలోని బావిలోనికి పడేస్తాడు. రూమి మరియు అతని చుట్టూ ఉండే వారందరూ షామ్స్ పనికి కోపగిస్తారు.

కాసేపటి తర్వాత షామ్స్ ఆ పుస్తకాలను బావి నుండి బయటకు తీసి చూడగా ఆ పుస్తకాలు తడవకుండా ఉండడం చూసి రూమి ఆశ్చర్య పోతాడు.
వాటిని చూడడంతో సద్గురువు యొక్క జ్ఞానంతో పోల్చుకొంటే తన పుస్తకాలు శూన్యం అని రూమి గ్రహిస్తాడు. తర్వాత రూమి స్వయంగా ఆ పుస్తకాలను బావిలో పారవేసి షామ్స్ వెంట బయలుదేరుతాడు.

షామ్స్-ఎ-తబ్రీజ్ తనకు ఇష్టమైన చౌఖత్ అనే ఆటను ఆడుతుండేవాడు.
రూమి ఎప్పుడూ ఆ ఆటలో ఓడిపోతూ ఉండేవాడు.
ఎన్నో సంవత్సరాలు షామ్స్ తో రూమి గడిపిన తర్వాత ఓ రోజు ఆటను ఆడుతున్న సమయంలో ఎప్పటి లాగానే రూమి "మళ్ళీ నేను ఓడిపోయాను" అనగానే షామ్స్ ఈ విధంగా పలుకుతాడు: "లేదు. ఈసారి నువ్వే గెలిచావు."
ఆ తక్షణమే షామ్స్ నుండి రూమి ఆత్మ సాక్షాత్కారాన్ని పొందుతాడు.
-అవతార్ మెహెర్ బాబా
[లార్డ్ మెహెర్ 18-6055 {USA ఎడిషన్}]

# ప్రేమించడం

ప్రేమించడం అంటే భగవంతుడి వద్దకు చేరడం.

ప్రేమికుడి గుండె ఎన్నడూ దుఖపడదు.
ప్రేమికుడి వస్త్రం ఎన్నడూ మరణించే వారిని తాకదు.
ప్రేమికుడి భౌతిక శరీరం భూమిలో
ఖననం చేసినట్లు ఎక్కడా కనుగొనలేదు.
ప్రేమించడం అంటే భగవంతుడి వద్దకు చేరడం.

-రూమి

To Love is to reach God
Never will a Lover's chest feel any sorrow.
Never will a Lover's robe be touched by mortals.
Never will a Lover's body be
found buried in the earth.
To Love is to reach God.

-RUMI

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం






# {9}. అంతర్యామితో ముఖాముఖి

డోనాల్డ్ స్మిత్ ఈ విధంగా మెహెర్ బాబాను ప్రశ్నించాడు:

మీ ఉద్దేశ్యం ఏమిటి లేక ప్రపంచంలో మీ పని ఏమిటి?

మెహెర్ బాబా సమాధానమిస్తూ...
నా ప్రేమను అందివ్వడం,
మానవ జాతిని మేల్కొపడం.

వాళ్ళందరికీ ప్రతీది మాయ అని మరియు భగవంతుడు ఒక్కడే ఏకైక సత్యమని తెలుసుకొని అనుభవించేలా చేయడం.

ఎవరైతే భగవంతుడిని ప్రేమిస్తారో వాళ్ళు ఆ సత్యాన్ని సాధించగలరు, పొందగలరు.
అందరూ సమానమే కాని ఎవరూ ఆ ఏకత్వాన్ని తెలుసుకోలేకపోతున్నారు.

భగవంతుడు నీలోనే ఉన్నాడు. కాని నీకు భగవంతుడికి మధ్య నువ్వే ఓ తెరలా ఉన్నావు.
భగవంతుడు నాలో ఉన్నాడు. నేను ఈ దేహాన్ని తీసుకొన్నది ఆ తెరను తొలగించడానికే. కాబట్టి అందరూ
తమను తాము భగవంతుడిగా సాక్షాత్కరించుకోగలుగుతారు.

కేవలం భగవంతుడు మాత్రమే అందరిలో నివసిస్తున్నాడు. నేను వచ్చినదే ఆ తెర తొలగించి తద్వారా అక్కడ ఒకే ఒక సత్యము ఉన్నదని మిగతాదంతా మాయ అని తెలియపరచడానికి.

డోనాల్డ్ స్మిత్ కాస్త కంగారు పడుతూ నత్తిగా మాట్లాడుతూ... సత్యం అనేది ఒకేసారి లోపల బయట ఉంటుందా? ....

మెహెర్ బాబా చెబుతూ.. అక్కడ లోపల లేదు బయట లేదు. సత్యమే అంతటా విస్తరించి ఉన్నది.

ఇదంతా ఆ సత్యం యొక్క నీడ మాత్రమే.
అక్కడ వాస్తవానికి సత్యం మించి వేరే ఏదీ లేదు. లోపల అనేది లేదు మరియు బయట అనేది లేదు, లేవడం అనేది లేదు పడడం అనేది లేదు. సత్యం అన్నింటా, అంతటా వ్యాపించి ఉన్నది. కాని మాయ అనేది పిలవబడుతుందో అది కూడా సత్యం నుండే బయటకు వచ్చింది. అది సత్యం యొక్క నీడ మాత్రమే.

నీవు నడుస్తున్నప్పుడు నీడ నిన్ను వెంబడిస్తుంది కాని నీవు ఆ నీడకి ప్రాధాన్యత ఇవ్వవు. నీవు ఆ నీడకి ఎటువంటి ప్రాముఖ్యతని ఇవ్వవు ఎందుకంటే అది కేవలం నీడ మాత్రమే కాబట్టి.

నీడ నీ నుండే వచ్చింది; నిన్ను వెంబడించేది నీ స్వంత నీడ. నీవు నీడని వెంబడించడం లేదు.

సరిగ్గా మిట్ట మధ్యాహ్నం 12 గంటలకు నీడ అనేది కనబడకుండా పోతుంది. ఎందుకు? అది లేదు కాబట్టే; అందువలననే అది కనబడకుండా పోయింది. నీవు మాత్రమే సత్యానివి మరియు నీవు నీడ కాదు. వాటి ఉనికి అనేదే లేనే లేదు.

[లార్డ్ మెహెర్ పేజి.4099]

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {10}. అవతారుడికి ఉపశమనం కలిగించిన ధన్యజీవి -జిమ్ రీవ్స్ (20/8/1923 – 31/7/1964)



జిమ్ రీవ్స్ స్వరంలో గొప్ప బాధ ఉన్నది.
అతని పాటలు నా పని వలన కలిగే
శ్రమను తొలగించి ఉపశమనం కలిగిస్తుంది.
-అవతార్ మెహెర్ బాబా

Darling, after loving you
What else is there to do
'Cause darling, all the rest
Will just be second best.

I know I'll go tonight
Just comparing them to you
I'll be no good to anyone
After loving you.

Your love can't be replaced
With just another pretty face
And heartaches will remain
For they can't be erased.

Many loves may come along
But they won't live up to you
I'll be no good to anyone
After loving you...

ప్రేమికుడు తన ప్రేమికుడితో విన్నవించుకొనే పాట...

డార్లింగ్..నిన్నే ప్రేమించిన తర్వాత ఏ
పనైనా చేయడానికి అక్కడ ఏముంది?
కారణం ఏమిటో తెలుసా డార్లింగ్,మిగతావన్నీ
రెండవ ఉత్తమంగా ఉన్నవి.

నా జీవితమంతా కేవలం నీలోకి జొరబడి
పోల్చుకున్నాను అనే విషయం నాకు తెలుసు.
నేను ఎవ్వరికి మంచి కూడా కాకుండా పోయాను
అదీ నిన్నే ప్రేమించిన తర్వాత.

నీ ప్రేమని కేవలం వేరే సొగసైన ముఖముతో
భర్తీ చేయలేను.
అవి తుడిచి పెట్టలేనంతగా
హృదయపు వ్యధగానే ఉండిపోయింది.

చాలా ప్రేమలు వెంబడిస్తూ ఉంటాయి కాని అవి నీ
స్థాయిలో జీవించేవి కావు.
నేను ఎవ్వరికి మంచి కూడా కాకుండా పోయాను
అదీ నిన్నే ప్రేమించిన తర్వాత.



# {11}.షామ్స్-ఎ-తబ్రీజ్ అందిస్తున్న ప్రేమ యొక్క 40 నియమాలు

## మొదటి నియమం:

మనం భగవంతుడిని మనల్ని మనం ప్రత్యక్ష ప్రతిబింబాలుగా చూస్తున్నాము. ఒకవేళ భగవంతుడు భయాన్ని, నిందని మనస్సుకు దగ్గర చేస్తున్న సమయంలో మనలోనే చాలా భయం, నింద ఉంది అని వాటి అర్థం.
ఒకవేళ మనం భగవంతుడిని పరిపూర్ణమైన ప్రేమతో మరియు పరిపూర్ణమైన కరుణతో దర్శించగలిగితే అదే మనం.

## రెండవ నియమం:

సత్య మార్గం అనేది శిరస్సు శ్రమిస్తే వచ్చేది కాదు కాని హృదయం శ్రమిస్తే వచ్చేది. నీ హృదయాన్నే నీ ప్రప్రధమ మార్గనిర్దేశకత్వంగా మలుచుకో కాని నీ మనస్సును కాదు.
నీ హృదయంతో కలవడం, సవాళ్ళు నీ ఆత్మ మీదుగా వ్యాప్తి చెయ్యి. నీ అహంకారాన్ని తెలుసుకోవడం అనేది భగవంతుడి జ్ఞానం వైపు నిన్ను తీసుకెళుతుంది.

ఈ ప్రేమ పయనం ఇంకా కొనసాగుతుంది.....

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {12}. సద్గురువు జీవితంలోని సద్విషయములు (హఫీజ్ అందించిన దివాన్-ఎ-హఫీజ్)

సాహిత్య ప్రపంచంలో గొప్పకవిగా ప్రఖ్యాతి చెందిన హఫీజ్ ఆ కాలానికి కుతుబ్ అంటే సద్గురువు కూడా. దివ్యమార్గ దర్శకత్వం కోసం హఫీజ్ గ్రంధాల పైన ఆధారపడేవారు పర్షియాలోను, భారత దేశంలోను లక్షల సంఖ్యలో ఉన్నారు.

హఫీజ్ పద్యాల సంకలమైన దివాన్-ఎ-హఫీజ్ అనే గ్రంధాన్ని చదివి వెంటనే నిర్ణయాలు తీసుకొన్న సంఘటనలు అనేకంగా ఉన్నాయి. సలహా కోసం ఆ గ్రంధాన్ని సంప్రదించే అలవాటు నేటికీ సర్వసాధారణమై పోయింది.

హఫీజ్ భౌతిక దేహ ఖననాన్ని గూర్చిన నిర్ణయం కూడా ఆయన యొక్క దివాన్-ఎ-హఫీజ్ గ్రంధాన్ని సంప్రదించే ఏర్పాటు చేయబడింది.

అయినా కూడా ఆ పద్యాలలో వెలువరించే ఆధ్యాత్మిక రహస్యాలను గ్రహించిన వారు చాలా కొద్ది మంది మాత్రమే ఉన్నారు.

నిజానికి ఖ్వాజా(సద్గురువు) హఫీజ్ ఆధ్యాత్మికతలోని అన్ని దశలను ఒకటొకటిగా తన దివాన్ లో అభివర్ణించారు.

సంపూర్ణమైన ప్రతీ గజల్ దానిని అర్ధం చేసుకోగలవానికి ఒక ప్రత్యేకమైన ఆధ్యాత్మిక స్థితిని, స్థాయిని సూచిస్తుంది.

-అవతార్ మెహెర్ బాబా
[మెహెర్ ప్రభు 3-1082/3]

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

# {13}. ఈ ప్రపంచమే నా గృహం కాదు (మానసిక స్వేచ్ఛ -సంతోషం)

కారణం బట్టే కార్యం -కారణం అనేది పెద్దది కావచ్చు మరియు ముఖ్యమైనది కావచ్చు లేక చిన్నది కావచ్చు మరియు ముఖ్యమైనది కాక పోవచ్చు.

కాని ఫలితం మాత్రం ఖచ్చితంగా వాటికి అనుగుణంగానే ఉంటుంది. ఈ ప్రపంచపు దుఖాలు అనేవి ఊహా పూరితమైనవి మరియు మన అజ్ఞానపు స్వయం-కృపారాధన ఫలితాలే.

కారణం లేని కార్యాల గురించి సమర్ధించవలసిన అవసరం లేదు. ఒకవేళ కారణం లేని పక్షాన వాటిని వెంబడించే ఫలితాలు -నిజాలు కానివి, నిస్సారమైనవి మరియు అర్ధరహితమైనవి.

కాబట్టి వీటి వెనుక ఊహ తప్ప మరేదీ లేని ఈ ప్రపంచపు సంతోషాల, బాధల గురించి చింత ఎందుకు?

ఓ ప్రేక్షకుడిలా చుట్టూ జరుగుతూ వెళ్ళే విషయాలను గమనిస్తూ మాససిక స్వేచ్ఛను పొంది సంతోషంగా వెళ్ళిపోవడమే.

హాఫీజ్ ఇలా అంటాడు:

ఈ ప్రపంచపు సంతోషాలు మరియు దుఖాలు అనేవి
ఇలా వచ్చి అలా వెళ్లి పోయేటువంటివి.
కాబట్టే సర్వకాలావస్థలో ప్రశాంతంగా ఉండిపోవడం ఉత్తమం.

-అవతార్ మెహెర్ బాబా
[లార్డ్ మెహెర్ పేజి.352(ఆన్ లైన్ ఎడిషన్)]

ఆ క్షణం రాదిక మరుక్షణం కాబట్టే మొదలుపెట్టు తక్షణం

Lover of God
Lives of Perfect Joy

ఒక్క మాట చెబుతా
వినకు-రాసుకోకు-గుర్తుపెట్టుకోకు
కాని గుండెల్లో పదిలంగా దాచుకో

భగవత్-ప్రేమికుడు
ఆనందమయ జీవితాలు

(మాయావి చెంతకు చేరే ఏకైక మార్గం)

కొన్ని యుగాలుగా ఏ మాయ అయితే నిన్ను ఉపయోగించుకొని తన ఆధీనంలో ఉండేలా తయారుచేసుకొన్నదో, అటువంటి మాయను నీవు ఉపయోగించుకొని నీ నియంత్రణలో ఉండేలా తయారు చేసుకున్న క్షణం నుండే నీ జీవిత పయనం మళ్ళీ సృష్టిలోకి కాక/రాక సృష్టికర్త అయిన మాయావి చెంతకు నిన్ను ఖచ్చితంగా చేరుస్తుంది.

-సూఫీ

నిన్ను పవిత్ర పరిచేవాడు,
నిన్ను నీకు పరిచయం చేసే వాడు,
నిన్ను భగవంతుడికి దగ్గర చేసే ప్రతీ వాడూ నీ జీవితంలోకి వచ్చే సూఫీయే.

ఇదే ప్రేమకు సరయిన సమయం.
ఇక నిరీక్షించవలసిన అవసరం లేదు.
మనందరి శిరస్సులను కోల్పోయి
సంబరాలు చేసుకొందాం...

-హాఫీజ్



ఇది ముగింపు కానే కాదు.
మళ్ళీ భగవంతుడితో మరియు భగవత్-ప్రేమికులతో కలిసే ఆ అమృత ఘడియల కోసం ఆత్రుతతో ఎదురుచూస్తూ...
వచ్చే మాసం ఖచ్చితంగా,నిస్సందేహంగా,తప్పకుండా,మరిచిపోకుండా కలుద్దాం...
ప్రియతమ అవతార్ మెహెర్ బాబా కి జై

mehera.meher77@gmail.com